శ్రీరస్తు.

# తిరుపతమ్మకథ

( రామన్న కథ మాదిరి )



ద్వితీయముద్రణము

[illegible] ముద్రాక్షరశాల, తెనాలి

[కాపీరైటు]  1927  [వెల 0-2-0

ఓం

శ్రీ ర స్తు.

# తి రు ప త మ్మ క థ

## (కా మ మ్మ క థ మా ది రి)



శుభమమ్మ ఓతిరుపతమ్మ మాయమ్మా తిరుపతమ్మ
అతిపుణ్యనదియైన మునియేటిదరిని తిరుపతమ్మ
పెనగంచిప్రోలనెడి ఘనపురిమునందు తిరుపతమ్మ
శ్రీకమ్మకులజుండు శివసోమరాజు జననమొంది
సింగిమాంబాయనెడి రమణితోగూడి సుఖముగాను
అతిధర్మశాలురై నలరుచుండెదరు తిరుపతమ్మ
తనకు సంతతిలేక తల్లడిల్లుచును రంగమాంబ
గుళ్లు గోపురములు చాలగట్టించె రంగమాంబ
చెరువులు భావులు చాలత్రవ్వించె రంగమాంబ
అన్నమును బీదలకు నధికముగబెట్టె రంగమాంబ
పెండ్లిలేని వారికిని పెండ్లిజేసె రంగమాంబ
దివ్యక్షేత్రములన్ని తిరిగి సేవించె రంగమాంబ
నోములన్నియును తానోచె సఫలముగ రంగమాంబ
గోదాన భూదాన వస్త్రదానములు రంగమాంబ
బ్రాహ్మణోత్తములకు బాగుగానొసగె రంగమాంబ
యెన్నిజేసిన సంతు యేమిలేదాయె రంగమకును
యికనేమి జేతుమని అతిచింతతోను నుండగాను
ఒకనాటిరేయి శ్రీవేంకటేశ్వరులు రంగమకును
కలలోన గనుపించి యీరీతిబలికె స్వామివారు
నీవుసంతతికొరకు చింతింపవలదు రంగమాంబ

కుపుత్రిక నేను నిచ్చితినిగాని రంగమాంబ
నా పేరు పెట్టుమని నయముగా బల్కె స్వామివారు
అదృశ్యుడాయె నా కలలోనె యపుడె రంగమకును
అంతలో నాతరుణి నిద్రమేల్కాంచి లేచిచూడ
అక్కటా యెవ్వరూ కానరారాయె రంగమకును
యిదియేమి వింతయని అతిమోదమునను రంగమాంబ
తనదు భర్తను లేపి తానిట్టులనియె రంగమాంబ
వినుడయ్యా నామనవి వివరంబుగాను ప్రాణనాధ
శేషశైలేశుండు శీఘ్రంబుగాను స్వప్నమందు
నాకు దరిశనమిచ్చి యీరీతి బల్కె స్వామివారు
సంతులేదని నీవు చింతింపవలదు రంగమాంబ
నీకునొక పుత్రికను ఇచ్చితిని నేను రంగమాంబ
నా పేరు పెట్టుమని అదృశ్యుడాయె స్వామివారు
అనిపల్కు సతి వాక్యములు నాలకించి భర్తగారు
భార్యతోడను గూడి బహుసంతసమున నుండగాను
ఆస్వామి కరుణచే నెలతప్పినాది రంగమకును
తొమ్మిదవ మాసమున తొలకరి మెరుపు రీతిగాను
నొక్క స్త్రీరత్నంబు నుద్భవించినది రంగమకును
ఆ బాలికను జూచి అతిమోదమునను తండ్రిగారు
ఆ బాలికకు నామకరణంబు చేయ బ్రాహ్మణులను
పిలిపించి తిరుపతమ్మని పేరు పెట్టి బాలికకును
భోజనంబును వస్త్రదానంబులొసగి బ్రాహ్మణులకు
సంభావనలు చాలనిచ్చి సంపిరిగా బ్రాహ్మణులను
ఆరోజు మొదలుగా నతిప్రేమతోను తిరుపతెమను
పెంచుచుండిరి తల్లితండ్రులయితేను తిరుపతమను
ఆ బాల దినదినంబొక రీతిగాను పెరుగుచుండె
బాలచంద్రుని రీతి మరి పెరుగుచుండె తిరుపతమ్మ
ఆవూరిలో నొక్క సాహెబుగారు తిరుపతమకు

మల్లెపువ్వులు తెచ్చి మరి యిచ్చుచుండె తిరుపతమకు
ఒకనాడు రహిమానుఖానుపువ్వులనూ తెచ్చుటకును
మరచియుండినవంత మరిపువ్వులకును తిరుపతమ్మ
ఒక్క చెలికత్తెను వెంటపెట్టుకుని తిరుపతమ్మ
రహిమానుఖానుండే పూలంగడికిని తిరుపతమ్మ
వెళ్లగా రహిమానుఖాను తాజూచి తిరుపతమును
నేనుగావలెనని యత్నించుచుంటె యింతలోన
సెలవిచ్చుటకినిట్లు గాతగునతల్లీ తిరుపతమ్మ
అనిపల్కి రహిమానుకాను పువ్వులను తిరుపతమకు
కావలసియున్నన్ని కడుముదంబునను యిచ్చినాడు
అట్టిసమయమునందు నొకచిన్నవాడు అంగడిలో
రహిమానుఖాను ప్రక్కనకూరుచోని యుండగాను
అచిన్నవానిని అతిప్రేమతోను తిరుపతమ్మ
కన్నులారగజూచి కడుసంతసించె తిరుపతమ్మ
తిరుపతమ్మనుజూచి చిరునవ్వుతోను చిన్నవాడు
మానసమున సంతోషమగ్నుడై యుండె చిన్నవాడు
ఇట్లునొకనొకరిని జూచుకున్నారు యిద్దరైతె
గాని తిరుపతిదేవి యచటనిలుచుటకు వీలులేక
చెలికత్తెతో కూడి పయినమైనాది తిరుపతమ్మ
బయలుదేరుటె కాని భ్రమవిడదాయె తిరుపతమకు
గోపరాజుకు నల్లకోరికుండెనుగా నామెయందు
యెటులయిన బయలుదేరింటికొచ్చింది తిరుపతమ్మ
మానసతిరుపతమ్మకు నవయవ్వనంబువచ్చినాది
అనిపరిణయము చేయ యత్నించినారు తల్లిదండ్రి
తోగినచుట్టరికమును వెదకుచుండిరిగా తిరుపతమకు
తిరుపతమ్మకుముందు పూలయంగడిలో చూచినట్టి
నాయకుని పై మనసు విడకనుపోయె తిరుపతమకు
నిద్రహారములనుమాని యున్నాదితిరుపతమ్మ

యిట్లుండరంగమాంబాదేవికైతె యీశ్వరుండు
స్వప్నమందున మరల దరిశనంబొసగి రంగమకును
నీకూతునకుతగిన పతి గోపరాజు రంగమాంబ
అతడు నీగృహమునకు కొన్నిదినముల్లకు రాగలండు
అనిచెప్పి యీశ్వరుండదృశ్యుడాయె అంతటాను
రంగమాంబాదేవి పతికడకునేగి జరిగియున్న
సంగతంతయుదెలుప సివసోమరాజు మనసునందు
అమితముగ ఆనందమును బొందియపుడు భార్యతోడ
సంతానమొసగిన సర్వేశ్వరుండు తిరిగిమనకు
దరిశనంబునునొసగి ధన్యులనుజేసె యింక మనము
మనపుత్రికకు పరిణయము నాపతగదు అనుచువారు
ఒకనాటిసమయమున పుత్రికనుపిలచి తండ్రిగారు
అమ్మనీయదృష్టమేమి చెప్పెదును తిరుపతమ్మ
అనిస్వప్నవృత్తాంతమంతయును దెలుప తిరుపతమ్మ
మనమున సంతోషమగ్నురాలాయె తిరుపతమ్మ
అలనాడనేజూచినట్టి నాయకుడె నాకుగనుక
భర్తకాగలడని అతిసిగ్గుచేత తిరుపతమ్మ
తండ్రికిని ప్రతిమాట చెప్పకనుపోయె తిరుపతమ్మ
అంతజనకుడు తనదుపుత్రికనుజూచి తిరుపతమ్మ
అమ్మనీపట్ల భగవంతుడున్నాడె తిరుపతమ్మ
నీవుకోరినవరుని నీకుతెచ్చెదనే తిరుపతమ్మ
అని మంచిముహూర్తమును విచారించి పెద్దలంత
అతిరూపవంతుడా గోపయ్యాఖ్యునకు తిరుపతమకు
మంగళవాద్యములు మ్రోగుచుండగను పెండ్లిజేసి
అందరును సంతోషమగ్నులైనారు అంతటాను
కొంతకాలమునకు గోపయ్యయింట తిరుపతమ్మ
సంసారమును జేయచనుదెంచినాది తిరుపతమ్మ
వచ్చినప్పటినుంచి వరునిపై ప్రేమ తిరుపతమ్మ

చాలగను నుంచియును భక్తితోడుతను తిరుపతమ్మ
భర్తయే దైవమని భావించుచుండె తిరుపతమ్మ
పాన్పుదిగినంతనే భర్త పాదములు తిరుపతమ్మ
కనులకద్దుచునుండు కడుప్రేమతోను తిరుపతమ్మ
భర్తయాజ్ఞను సిరమునందుంచుకొనుచు తిరుపతమ్మ
నిత్యమును సేవలను నెరపుచుండునుగా తిరుపతమ్మ
అన్నవస్త్రములేక నల్లాడుచున్న వారలకును
శక్తికొలదిగ నన్నవస్త్రంబులిడుచు తిరుపతమ్మ
పతివ్రతరాలుగా పరుగుచుండెనుగా తిరుపతమ్మ
యీ విధిని దంపతులు యింపుతోడుతను నుండగాను
అట్టిసమయమునందు కుష్టువ్యాధొకటి తిరుపతమకు
సంభవించియు చాలదిగులుపడుచుండె తిరుపతమ్మ
ఒకనాడుగోపయ్య సతినెడబాసి ఆవులకునై
పశువులుండెడి కాననమునకేతెంచి గోపయ్య
అందు మేయుచునున్న ఆవులనుజూచి గోపయ్య
పశువుల మేపేటి బాలకులజూచి గోపయ్య
తినయావులకు మేత తకుగేమిలేక బాగంగాను
కడుపారతినుచుండ కడుసంతసించి గోపరాజు
గోపబాలురగూడి కొమరొప్పగాను యేటిలోన
స్నానంబుజేసిసరసాన్నంబుగుడిచి గోపరాజు
కథలను జెప్పుకుని కాలంబుగడిపె గోపరాజు
సూర్యబింబము పశ్చిమాద్రిగ్రుంకె నంతటాను
అప్పుడావులమందలన్ని వేర్వేర గోపరాజు
పంపు గుంపుగజేర్చుకొని పరీక్షించె గోపరాజు
గోపయ్య గోవొకటి కనుపడకపోయె నచ్చటాను
లమందలుమీరు అతివేగముగను తోలుకొని
వుడంచును గోపబాలురకుజెప్ప గోపరాజు
గోపబాలురు బయలుదేరి పోయారి అంతటాను

గోపయ్య వొంటిగాకొన్ని యడవులును కొండగృహాలు
యెన్ని తిరిగిన గోవు కనుపడకపోయె గోపయకును
చీకట్లు గమ్మెను యేక రీతిగను నప్పుడూను
దారియేమియు కంటికగుపడకపోయె గోపయకున
యిదియేమి వింతయని మదిలోనదలచి గోపరాజు
యింటిమార్గము బట్టిపోవుచుండగను చీకటిలో
క్రూరవ్యాఘ్రంబొకటి గోపయనుజూచి దారిలోన
కుప్పించి గోపయ్యపై కెగసినాది పెద్దపులియు
ఘోరమౌ గోళ్లచే గోపయ్యను బట్టిచీల్చి వేసి
రక్తమంతయుబీల్చి ప్రాణములుదీసె పెదపులియు
నాటినేయంతయు నాథుడొచ్చునని తిరుపతమ్మ
యెదురుజూచుచునుండె యేకరీతిగను తిరుపతమ్మ
గోపయ్య నెదుకుచు గోపబాలకులు అడవులందు
గోపయ్య మృతకాయమును జూచివచ్చి తిరుపతమ్మకు
అమ్మనీభర్తనొక పులిజంపినాది యనుచుజెప్ప
ఆబాలకులమాట లాలకించినది తిరుపతమ్మ
హా యీశ్వరాయంచు పాడలసాగినది తిరుపతమ్మ
ధరణిపైమూర్ఛిల్లి తనువు మరచింది తిరుపతమ్మ
తాతెలిసి తాతెచ్చుకొనుచు లేచింది తిరుపతమ్మ
హా ప్రాణనాథుండ హాగోపయాఖ్య ప్రాణనాథ
నిన్నువెడబాసి నేనెట్లుబ్రతుకుదును ప్రాణనాథ
నేటితోనూరేళ్లునిండెనా నీకు ప్రాణనాథ
నాజీవనంబేల నాబ్రతుకుయేలా ప్రాణనాథ
అనుచు తిరుపతిదేవి అతిదుఃఖముననుపాడలసాగి
అగ్నిగుండంబును త్రవ్వించినాది తిరుపతమ్మ
తనబంధువులకెల్ల దండములుబెట్టి తిరుపతమ్మ
పసడికాయంబంత పసుపురాసుకొని తిరుపతమ్మ
మునివేటిలోన స్నానముజేసినాది తిరుపతమ్మ

అత్తమామలకు దండము పెట్టినాది తిరుపతమ్మ
పస్పుచేలములను పరగకట్టుకొని తిరుపతమ్మ
అగ్నిగుండము చుట్టు ముమ్మారుతిరిగి తిరుపతమ్మ
తనభర్త పాదములు తనహృదయమందు నిలుపుకొ
ప్రీతిపాత్రుని చాలవినుతులొనరించి తిరుపతమ్మ
శ్రీరామచంద్రుని చిత్తముననిల్పి తిరుపతమ్మ
నాభర్త సన్నిధికి నను జేర్చుమనుచు తిరుపతమ్మ
అగ్నిగుండమునందు నతివేగదుమికె తిరుపతమ్మ
దూకిన గుండములో తనమహిమజూప తిరుపతమ్మ
కుచ్చెళ్ళ చెంగును కుంకుమభరిణ తిరుపతమ్మ
మాంగళ్యసూత్రంపు బొందుజూపినది తిరుపతమ్మ
గూమూడు ఆనవాళ్లను జూపినాది తిరుపతమ్మ
సకలస్త్రీ పురుషులు సంతోషమునను అప్పుడూను
పరమపతివ్రతయనుచు పొగడిరందరును తిరుపతమను
పెనుగంచి ప్రోలనెడి ఘనపట్టణమున తిరుపతమ్మ
వెలయుంక నీమహిమ తెలియజేయగను తిరుపతమ్మ
నీపేర దేవళముస్థాపించినారు తిరుపతమ్మ
మాఘఫాల్గుణ మాసముల పూర్ణిమందు తిరుపతమ్మ
సకలకులములవారు ప్రతివత్సరమున తిరుపతమ్మ
నీకుపూజలుచేసి నిన్నుగొల్చెదరు తిరుపతమ్మ
సంతానప్రాప్తికై సంతోషమునను సకలజనులు
స్నానంబుచేసి ప్రాణాచారములనుపడగ నీవు
సంతానమొసగితివి సత్యంబుగాను తిరుపతమ్మ
గ్రహబాధ రోగబాధలబాపినావు తిరుపతమ్మ
యెవ్వారలైననీనామ మాత్రమున తిరుపతమ్మ
మారీమహామారి స్ఫోటకాదులను తిరుపతమ్మ
తొలగి ఆరోగ్యంబు కలుగజేయునుగా తిరుపతమ్మ
జననమొందిన చంటిబిడ్డలకు జనులు తిరుపతమ్మ

ప్రగట్టియు పుట్టువెంట్రుకలనిచ్చి తిరుపతమ్మ
గ్రొదోపుడులిచ్చి నిన్నుగొల్చెదరు తిరుపతమ్మ
కోమ తెలుపంగ నీయుత్సవమున కోటిప్రభలు
పు కుంకుమబండ్లు బాగవచ్చునుగా తిరుపతమ్మ
యుత్సవమునందు నేజాఢ్యమేని కలుగకుండ
కాపాడి రక్షించుచున్నావుతల్లీ తిరుపతమ్మ
అతిభక్తితో నిన్ను నమ్మియున్నట్టి నరులకెల్ల
ధనకనకవస్తు వాహనము లొసగితివి తిరుపతమ్మ
కమ్మవంశము కెల్లఘనమైనకీర్తి దెచ్చినట్టి
తిరుపతీదేవి మముకరుణతో బ్రోవు మరుపులేక
భక్తితో నీచరిత్రము నెల్లడిగను తిరుపతమ్మ
వ్రాయమని యన్నట్టి వైశ్యకులజుండు తిరుపతమ్మ
నరసింహారావుపై నతిప్రేమయుంచి తిరుపతమ్మ
సతతమైశ్వర్యంబు సమకూర్చుతల్లి తిరుపతమ్మ
యేదేశమున క్షామమెపుడు లేకుండ తిరుపతమ్మ
ఫలసస్యముల నెపుడు పండించుతల్లి తిరుపతమ్మ
అన్యోన్యమైత్రితో జనులుండుగాక తిరుపతమ్మ
ఆచంద్రతారార్కముగను నీకీర్తి తిరుపతమ్మ
నిలిచి ప్రజలకు నెల్లమేలుగూర్చునుగా తిరుపతమ్మ
అవనిలో నీకథను చదివినను విన్నావారలకును
కరుణతో సిరులొసగి కాపాడుమమ్మ తిరుపతమ్మ
మంగళము నిత్యజయమంగళము నీకు తిరుపతమ్మ

సంపూర్ణము.

—(0)—

